సంపుటము 1] డిసెంబరు 1914 [సంచిక 6

# బాలమిత్ర

## బైబిలు పిల్లలు




బాలుడైన యేసు

ప్రియబాలమిత్రులారా!

ఈ మాసము, మనమందరము మిగుల ఆశతో ఎదురు చూచుచున్న సంతస క్రిస్మసు సమయము. మీ కందరకు సంతస క్రిస్మసు భాగ్యములు కలుగుగాక!

బాలుడైన యేసు చరిత్ర చిన్ననాటనుండి వినుచు, పండుగ నెంతో సంతోషముతో చేసికొనుచున్నను, ప్రతిసంవత్సరము ఈ కథను వినుటలేక వినుటకు మనమెల్లరము చెవులు విప్పుకొనియుందుము. ఈ యేసుబాలుని పుట్టుకచరిత్ర మిగుల విచిత్రము. ఈయన భాగ్యవతియు, గుణవతియునగు కన్య మరియమ్మకు నరావతారమున పుట్టిన మనపాలిటి రక్షకుడు. పరమున తనకున్న గొప్పస్థితి మానుకొని, ఈ పాపలోకము నకు వచ్చి, దీనబాలుడుగా బెత్లెహేము ఊరిలో పశులపాక యందు పుట్టెను.

పాపము! మరియమ్మ ముద్దుబాలకుని పొత్తిగుడ్డలతో చుట్టి, పశువులతొట్టినే ఆసమయమునకు ఉయ్యాలగా చేసి పరుండబెట్టి యుంచెను. ఆసమయమున ఆకాశమందలి దూతలు సంతోష ముతో స్తుతి గీతములు పాడిరి. ఆరాత్రి గొఱ్ఱెల గాయు చున్న గొల్లలకు గాబ్రియేలు దూత కనుబడి, యేసుబాలుని జననవార్త వారికి ఎరిగించి, వెళ్లి చూచిరండు అని చెప్పెను. విధేయతగల ఆ గొల్లబోయలు దూత జెప్పినమాట „ప్రీతితో నాలకించి," మెత్తగా నిద్రించు చిట్టిబాలునిజూచి సంతోషించిరి.

ఈబాలుడు పుట్టిన సమయమునందు ఆకాశమున చిత్రమైన చుక్క ఒక్కటి కనుపడెను. దానిగుర్తించిన ముగ్గురు జ్ఞానులు ఆ నక్షత్రమునే వారికి త్రోవచూపుదానిగా జేసికొని ఆ చిన్న

పాపను చూడ బయలుదేరిరి. ఆ జ్ఞానులలో నొకడు మన దేశ మగు ఇండియా నుండి వెళ్లినవాడని మీకు తెలియునా? మన ఇండియా దేశపు జ్ఞానియు, తక్కిన ఇద్దరు జ్ఞానులవలె ప్రభువునకు కానుక సమర్పించుటకు తనకు తోచినది తీసుకొని వెళ్లెను. వేరువేరు ప్రదేశములనుండి బయలుదేరి వచ్చినను, వీరు మార్గమున, ఒక్కచోటనే కలుసుకొనిరి. ఒకరిక్షేమవార్త మరియొకరు అడుగుకొని, వారెందుకు వెళ్లుచున్నది ప్రశ్నించుకొని ముగ్గురు ఒకేచోటికి వెళ్లుచున్నామని తెలిసికొని మిగుల సంతసించిరి. ఇట్లు ప్రయాణమై వెళ్లుచున్న వీరు, యూదులరాజ్యము ఏలుచున్న హేరోదు అను క్రూర రాజును దర్శించి, క్రొత్తగా జన్మించిన బాలకునిగురించి ఏమియు ఎరుగని ఆ రాజును మొదట అడిగిరి. ఆతనికి తెలియకున్నందున శాస్త్రజ్ఞులను విచారించి నిజము తెలిసికొనిరి. తరువాత యూదుల రాజుగా పుట్టిన చిన్న యేసుబాలుని పశువులపాకయందు చూచి తెచ్చిన కానుకల నా చిట్టిబాలునికి సమర్పించిరి. హేరోదు ఆ బాలుడు యూదులరాజుగా పుట్టినాడని విని అసూయత పట్టలేక ఆబాలుని చంపుటకు సకల ప్రయత్నములు చేసినను " తానొకటి తలచితే దైవము వేరుతలంచెను" ను విధముగా నెరవేరకపోయెను.

వారము వయస్సుగల ఈ ముద్దులబాలుని ప్రవక్తలగు వృద్ధుడైన సిమ్యోనును, విధవయగు హన్నాయును కౌగిట చేర్చుకొని ఆశీర్వదించిరి.

మనమెరిగిన ఈ చిన్నకథయందు ఎన్నో మంచిమంచి పాఠములు మనము చేర్చుకొనవచ్చును. ఇట్టి మంచి పాఠములను మంచి మనసులతో నేర్చుకొని, అన్నిపనులందు, చక్కగా నడుచుకొనుటకు దేవుడు మనకు సహాయపడుగాక. మనలను రక్షించ వచ్చిన మన యేసయ్యయే, మన రక్షకుడని యెరిగి, ఆయనకు ఇష్టమైన విధమున నడచి, మన బ్రతుకు కాలమునందు త్రోవజూపు చుక్క, ఆయనే యని తెలిసికొని, సదా ఆ రక్షకుడు అనుగ్రహించిన రక్షణకై ఆయనను స్తుతించుచు జీవింతుము గాక!

---

# బియ్యపుగింజకు బంగారము

ఒక ఊరిలో బిచ్చమెత్తుకొనే బాలుడొకడుండెను. వాడు రోజు ఇంటింటికి తిరిగి బిచ్చమెత్తుకొని బ్రతికేవాడు. ఆ ఊరిలోనివారు బీదవారైనందున, వానికి పెట్టే బిచ్చము అంత ఎక్కువ కాదు. ఒకనాడు వాడు ఆ ఊరిలో తిరుగుచుండగా, చాలదూరములో ఒక సందడి వినబడెను. అదేమిటో

యుని వెనుకకు తిరిగిచూడగా, రాజుగారు ఒక బంగారపు బండి మీదనెక్కి వచ్చుచుండుట కనుబడెను. ఆయనను చూడగానే వీని కెక్కడలేని సంతోషము కలిగినది. రాజుగారు తానున్న వీధిలోగుండ, తానున్నవైపునకే వచ్చుచున్నందున, వాడు, తన దరిద్రపు దినములు గతించినవని తలంచెను. తానడుగక పోయినను రాజుగారు చాల సొమ్మిచ్చును గనుక ఇక బిచ్చ మెత్తుకొనవలసిన నక్కర లేదని తలంచెను.

ఆ గుంపు తనకు మరీ దగ్గరకువచ్చెను. రాజుగారి బండి తనకు సరిగా వచ్చేసరికి ఆ బిచ్చగాడు భిక్షుపుజోలెను రాజు గారివైపు చాపి భిక్షమడిగెను. బండి తోలువాడు బండిని ఆపెను. రాజుగారు బండిదిగిరి. ఆయన ముఖము చిరునవ్వుతో కళకళలాడుచుండెను. ఆయన వాడున్నతావునకు వచ్చి, దయ గల తనముఖమునెత్తి వానివంక జూచెను. «ఆహా, ఇక నా దరిద్రత పోయినది. నేను బాగుపడుదినములు వచ్చినవి» అని వాడు లోలోన సంతోషించెను.

రాజుగారు తన కుడిచేతి నెత్తెను. దానియందు ఒక దమ్మిడి యైనాలేదు. అది ఉత్తచెయ్యే. తాను బిచ్చగానికిచ్చుటకు మారుగా «నాకేమి ఇచ్చెదవ»ని రాజడిగెను. భిక్షగానికి కలిగిన బెదురింతంతగాదు. దుఃఖమువచ్చెను. రాజుగారేమో ఇచ్చునని ఆశపెట్టుకొనెనుగాని ఆశ నిరాశయయ్యెను. రాజు

గారడిగినందున లేదనలేక జోలెలో చెయ్యిపెట్టి బియ్యపుగింజ నొకటి తీసి ఆయన చేతిలో పెట్టెను. తరువాత రాజుగారు వెళ్లిపోయిరి.

ప్రొద్దుగ్రుంకిన పిదప బిచ్చగాడు, ఇంటిదోవపట్టెను. ఇంట్లోకి వచ్చినపిదప బియ్యము చేటలో పోసెను. పోయగానే దీపము వెలుతురున తళుక్కుమని బంగారపు గింజ ఒకటి కనుబడెను. దానిని వాడు చూడగానే అయ్యో, నేనెంతఅదృష్ట హీనుడను. “నేనెంత ఇత్తునో రాజుగారంత నాకియ్యవలె నన్నది ఆయన ఉద్దేశము కాబోలు. అంతా ఎందుకియ్యక పోతిని” అని విచారపడెను.

ఇతరులకు మనకున్నదాని నిచ్చుటవలన మనకు గొప్ప ఆశీర్వాదములు కలుగును. మనమెంత ఇచ్చెదమో అంతగా మన కియ్యబడును.

---

## రాజభక్తి

కొన్ని సంవత్సరముల క్రిందట ఒక సైన్యములో నొక సిఫాయి తనకు నియమింపఁబడిన పనిని చేయుట యందు అశ్రద్ధగలవాడై అలసి నిద్రించుచుండినందున ఆ సిఫాయి చంపఁబడునట్లు ఉత్తరువాయెను. కాని రాజు ఈ

సంగతిని విని ఆసిపాయిని మన్నించి ఘోరశిక్షనుండి విడుదల చేయించెను.

అదిమొదలుకొని తన్ను క్షమించిన రాజుకొఱకు ప్రతి ఉదయము, సాయంకాలము ప్రార్థించుచుండెనట.

కొన్ని నెల లయిన తరువాత ఒకానొక యుద్ధములో ఆ సిపాయి మరణకరమైన గాయమునుపొంది చనిపోవుచుండఁగా రాజుగారిని మరువక "నారాజును రక్షించు" మని ప్రార్థించి ప్రాణమును విడిచెనట.

రాజభక్తియన నిట్టిదే కదా!

---

# మొదటి క్రిస్మస్ గులాబిపువ్వు

మహా చలిగల ఒకరాత్రి ఒకపల్లెటూరి సత్రములో నొక చిన్ని శిశువు పుట్టెను. ఈ బిడ్డను చూచుటకు దూరమునుండి జ్ఞానులువచ్చి, ఈబిడ్డ రాజగునని చెప్పిరి. వారాయనకు బంగారపు కానుకలను, పరిమళద్రవ్యములను దెచ్చి యర్పించిరి. ఆ ఊరిలోనివారుకూడా తమకు దోచిన కానుకలను దెచ్చి ఆబాలుని కిచ్చిరి. గాని పాపము ఒక చిన్న బీదపిల్ల తనయొద్ద యేమియు లేనందున యేడ్చుచు నిలువబడి యుండెను. అంతట ఆమె కొకదూత యగుపడి "చిన్న

పిల్లా! ఎందు కాలాగు యేడ్చుచున్నావు?” అని అడిగెను. అందుకా బాలిక “అయ్యా, ఆ బిడ్డకు ఏమయినా నియ్యవలెనని నాకు చాల ఆశగలదు గాని చేతిలో యేమియు లేద”నెను. “నీ పాదముల క్రింద హిమములో ఏమి కనుబడుచున్నదో చూడుము”ని దూత అనెను. వెంటనే అక్కడ ఒక చక్కని ఎర్ర చారలుగల తెల్లని గులాబిపువ్వగుపడెను. అప్పుడా దూత “ఈతెల్లని పువ్వు నీవు ఆ బాలరాజున కియ్యదలంచిన, నీ హృదయమందలి పవిత్రమైన కోరికె. ఆ ఎర్రని చార నీ హృదయములో ఆయనయెడల నున్న ప్రేమ” అని చెప్పెను. ఆబాలిక పువ్వునుకోసి ఆ బాలరాజు చేతిలో నుంచెను. ఇదే మొదటి క్రిస్మస్ గులాబిపువ్వు.

---

# మేక చెప్పిన బుద్ధి

ఒక సేనలో కొన్ని మేకలుగలవు. వాటన్నిటిలో బిల్లి అను మేకను ఆ సైన్యమందలి సిపాయిలందరు ముద్దుగా జూచుకొనువారు. కవాతు చేయునప్పుడుగాని, సిపాయిలందరు కూడినప్పుడుగాని, పేర్లు పిలుచునప్పుడుగాని అందరికంటె ముందుగా ఈ బిల్లీ వచ్చి హాజరగునది. అట్టి స్థలములలోకి వెళ్లుటకు దానికి బహు ఇష్టముగా నుండేది. వారిలో నెవరి



కైనను పని లేనప్పుడు దీనితో ఆడుకొనుచుండువారు. మేకలు పని చేయవలసివచ్చినప్పు డిది పని చేయుటకు అన్నిటికంటె ముందుగా వచ్చునది. దీనియొక్క శ్రద్ధనుబట్టి అందరును దీనిని బహుగా ప్రేమించిరి. బాగా తిండిపెట్టిరి. పండుకొనుటకు మంచితావు ఇచ్చిరి. మురికి లేకుండా చూచుకొనిరి. గనుక అక్కడనున్న మేక లన్నిటిలో ఈ బిల్లీ చాల సౌఖ్యముగానుండెను. అన్నిటికంటె తాను గొప్పదానని తలంచి నట్లగుపడుచుండెను. గర్వము నాశమునకు ముందు నడచును అనువాక్యము నిజము. ఈ బిల్లీ తన మంచి అలవాటులనుండి తొలగిపోయినది. ఏలాగు?

సిపాయిలు భోజనముచేయు గదిలోని ఏ ఆటంకమును లేక బిల్లీ పోయేది. అక్కడ నుండువారు దానికి తమ భోజన

ములో కొంత పెట్టుట వాడుకగానుండెను. ఇది వారిచ్చు దాని నెంతో తృప్తిగా తిని సంతోషించునది. ఒకనాడు ఒకడు తమాషాకు, “బిల్లీకి కొంచెము సారాయి ఇచ్చిచూతము” అని తన స్నేహితులతో ననెను. అప్పుడు వారు సంతోషించి, బిల్లీ సారాయి త్రాగినతరువాత ఏమిచేయునో చూచుటకు త్వర పడిరి. ఇంతలో ఒకడు దాని మూతియొద్ద సారాయిపాత్ర నుంచెను. బిల్లీ దానిని వాసనచూచి కొంచెము చప్పరించెను. తరువాత క్రమక్రమముగా చప్పరించి వారు మట్టికుండలో పోసి తన ముందుంచిన సారాయియంతయు త్రాగెను. తరు వాత దానికి నిషాఎక్కి, చేసిన తమాషాలనుగూర్చి తెలుప నవసరములేదు. గాని మరుసటి ఉదయము బిల్లీ పేర్లు పిలుచు నప్పుడు రాలేదు. ఇదే మొదటిమారు అది రాకపోవుట. ఆ దినమంతయు కనపడనేలేదు. రెండవ దినముకూడా బిల్లీ రాలేదు. గనుక వారు దానిగూర్చి విచారించిరి. దానిని తీసి కొని వచ్చుటకు ఒక సిపాయిని పంపిరి. వాడు వచ్చిచూడగా బిల్లీ తన స్థలములో పండుకొనియుండెను. కండ్లు నిద్రమత్తు గాను భారముగానుండెను. దానిపైన అంతయు బురదే. చాల మురికిగానుండెను. దానిని చూడగా దిగులుపడినదానివలె కను పడెను. ఇతడు దానినెంత పిల్చినను అది రాలేదు గనుక వీడు దానిని బలవంతముగా లేవదీసి లోనికి తీసికొనిపోయెను. అది

లోనికి రాగానే వారు సంతోషముతో చప్పట్లుకొట్టిరి. ఇది వరకు వచ్చినట్లుగా అది తల నెత్తుకొని గర్వముగా నడువలేదు.

వారిలో నొకడు "బిల్లీ, ఇదిగో త్రాగుము"ని నిండుగా సారాయి ఉన్న మట్టికుండను దానిముందు పెట్టెను. ఆమాట వినగానే మేక తలయెత్తి చూచెను. దానికండ్లు ప్రకాశించెను. ముందరికాలు దువ్వెను. మెడవంచి ఒక్క దూకుదూకి, ఢాం మని, ఒక్క దెబ్బతో ఆ సారాయికుండను ఢీకొనెను. ఆ దెబ్బకు కుండ వేయిముక్కలయి బల్లచుట్టు నున్నవారిని సారాయితో తడిపివేసెను. తరువాత అది తలను ఎత్తుకొని, నిర్భయముగాను, నెమ్మదిగాను బయటికి నడచిపోయెను.

త్రాగుబోతులకందరి కిది మంచి ఉపన్యాసము కాదా?

---

# ప్రకృతి పాఠములు

## 5-వ పాఠము

## పువ్వులవాడుకలు

నీకును నాకును ఉన్నట్లే పువ్వులకును కొన్ని అలవాటు లున్నవి. ఈసంగతి నీకు చిత్రముగా నుండవచ్చును. గాని కొంచెము శ్రద్ధతో పువ్వులను గమనించినయెడల అంత చిత్రముగా నుండదు.

స్వాభావికముగా పుష్పములకు వెలుతురన్న యిక్కలి యిష్టము. గనుక వెలుతురువైపుకు తిరిగియుండును. కిటికి లోపలి వైపున పూలచెట్టు నొకదానిపెట్టి చూచినయెడల ఈసంగతి చక్కగా తెలియును. రెండుమూడు దినముల కొకమారు దానిత్రొట్టిని కొంచెము కొంచెముగా త్రిప్పుటవలన నానాదిక్కులకు పుష్పములు తిరుగునట్లు జేయవచ్చును.

రాత్రులలో నిద్రపోయి ఉదయముననే మేల్కొను పుష్పములు కొన్నిగలవు. తామరపుష్పములు ఉదయమున బాగుగా వికసించును. పుష్పములలో ననేకజాతుల కీ యలవాటు గలదు. కొన్నిమారులు తేనెటీగలుగాని తుమ్మెదలుగాని ఈపుష్పముల లోని మకరందమును త్రాగుటకు లోనికిబోయి అవి ముకుళించగానే ఎటుపోవుటకును తోచక ఉదయమువరకు ఖైదులో పెట్టినట్లుండును. కొన్నిపుష్పములు కునికిపాట్లు బడుచున్నట్లుగా తలలను వంచుకొని యుండును. మరికొన్నిదినములో ఏదో ఒక కాలమునకు సరిగా వికసించుచుండును. కొన్ని పుష్పములు ఉదయమున చక్కగానుండి కొంతకాలమునకే ముడుచుకొనిపోయి వికారముగా కనుపడును. అనేక పుష్పములు అత్యుదయముననే, చాలమంది సోమరి బాలబాలికలకంటె ముందుగా మేల్కొని వారిని సిగ్గుపరచుచుండును. కలువలు, చంద్రకాంతలు మొదలగునవి పగలంతయు నిద్రించి రాత్రులలో

మేల్కొనునా యన్నట్లు వికసించును. ఇట్టివానిని దొంగ పువ్వులని చెప్పవచ్చును.

పువ్వులు వికసించి విప్పుకొనక పూర్వమును, వికసించినప్పుడును, ముడుచుకొనిన రీతియు కనిపెట్టుట మిగుల చిత్రముగానుండును. వికసించక పూర్వము 1 టిలో నున్నట్లు శంఖమువలె చుట్టుకొని యుండును. తొడిమె వద్ద లావుగను పైకి పోనుపోను సన్నముగ నుండును. 1-వ పటములో నున్న మాదిరి మొగ్గ మరునాటి ఉదయమునకు రెండవ పటములో నున్న దానివలె వికసించును.



1. పటము.

వికసించిన పువ్వుయొక్క తొడిమె భాగమునుంచి అంచు వరకు ఈనెలుండును. ఇవే పువ్వును పెద్దదిగా గనుపడునట్లు జేయును. గొడుగుకు బెత్తములెట్లో ఆలాగే ఈ యీనెలు పువ్వునకు ఉపయోగించును. 3 వ పటమునందు పువ్వు ముకుళించిన పిదప నుండురీతి యగుపడుచున్నది. పువ్వుయొక్క అంచు క్రమక్రమముగా లోనికి ముడుచుకొనిపోయి చివర కెండిపోవును.



2. పటము.



3. పటము.

పువ్వుల అలవాటులవలన మనమేమి నేర్చుకొనవచ్చును?

# బాలమిత్ర టపా




ప్రియమైన బాలమిత్రులారా! నేను తెలియు వ్రాయు సమాచారము ఏమనగా మీవలె, నేను సంతోషముగా నుండలేను. ఏమంటే నేను బుట్టిన సంవత్సరమునకు నా ప్రియమైన తల్లి చనిపోయినది. అప్పుడు నేను ఏలాగు బ్రతుకవలెనో మీరే విచారించండి. దేవుడు నన్ను జీవముతో ఈ పదునాలుగు సంవత్సరములు కాపాడినందుకు ఆయనకు స్తోత్రము. నేను ఒక హిందూకులములోని వాడను. నాకు

ఇద్దరు అన్నలును ఒకఅక్కయు గలరు గాని నాతండ్రి నేనుమాత్రము రక్షణమార్గ మవలంబించితిమి. ఇప్పుడు నా తండ్రియు నేనును అమలాపురములో ఉన్నాము. ఇచ్చట మిషను స్కూలులో నాలుగవక్లాసు చదువుచున్నాను. ఇంగ్లీషు కూడ చెప్పుదురు. మాబడిలో ఆరవక్లాసువరకు ఉన్నది. మన స్నేహితుడైన బాలమిత్రుని మాస్టరుగారు తెప్పించి నాకు ఇస్తూయున్నారు. నన్నును నాతండ్రిని మక్రే దొరసానమ్మగారు పోషించుచున్నారు. ఆమె నాకు కావలసిన పుస్తకములను బట్టలను ఇచ్చి చదివించుచున్నారు. ఇప్పుడు నేను చాల సంతోషముగ ఉన్నాను. నా చెలికాండ్లతో బాలమిత్రుని తెప్పించుకొండి అని హెచ్చరించుదును. అప్పుడప్పుడు నా సంగతి మీకు తెలుపుచుండవలెనని కోరుచున్నాను. నాకోసము ప్రార్థనచేయుండి. మీకు నా ప్రియసలాములు.

గుమ్మడి పోలిచెట్టి

అమలాపురము, గోదావరి జిల్లా

కీర్తన

# నూతన బాలమిత్ర



1. నూతన మిత్రుని — ముదముతో గంటిమి
తతములబంగిని — సంతసమొసగును.
2. నయము నీమిత్రుని — యనుమతిగోరెడి
బాల బాలికలకు — యలవడు జ్ఞానము.
3. లతకూనలకును — సత్యము దెలుపను
మిత్రముపగిని — కతలను జెప్పను.
4. త్రస్తముగల్గును — గ్రద్దనబరముని
స్తుతివందనములు — ముదముతో జేయను.

C. L. S. PRESS, MADRAS—1914